# కల్లుముంత - సారాయిసీసా

## బెజవాడ, 1929

Record no. 644

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

కల్లుముంత - సారాయిసీసా.- బెజవాడ : ప్రకృతి కార్యాలయము, 1929.

4, 4, 6, 4, (2) p. ;19 cm.

Record no. 644

Kallumunta - sārāyisīsā.- Bejavāḍa : Prakṛti Kāryālayamu, 1929.

4, 4, 6, 4, (2) p. ;19 cm.

Record no. 644

35 mm microfilm

Image placement: IA IIA IB IIB   Date filming began: 23 January, 2006

ప్రకృతి గ్రంథమాల 39.

# కల్లుముంత - సారాయిసీసా

## 1 వ భాగము

(కల్లు, సారాయి, బీర్, విస్కీ, బ్రాంది, సోడా, లిమ్నెడ్ మున్నగు దుష్టపానీయములను నిరసించును.)




ప్రకాశకులు:
ప్రకృతి కార్యాలయము, బెజవాడ.

బెజవాడ:
ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల యందు
క. కోదండరామయ్యగారిచే
ముద్రింపఁబడియె.

1929.

వెలయు } ఇతరులకు వెల రు 0–10–0.
} ప్రకృతి చందాదారులకు వెల రు 0–6–0.

# మద్యపాననిరసనదండకము

(అల్లంరాజు సూర్యనారాయణ మూర్తిగారు.)

ఓరీ! సురాపానలోలా! కృధాగ్ని ప్రకాశోరు పాలా! ఇసీ! దుష్టశీలా! మహా పాతకంబైన యీ మద్యపానంబు సేయంగనేలా! మదోన్మత్తతన్ లోకులం దిట్టనేలా! ఒడల్ తూలుచుం, జోగుచుం, గ్రుక్కుచున్, స్రుక్కుచున్, సోలుచున్, సిగ్గు గాసింత లేకుండ నాహా పథిన్ దొర్ల నేలా, జనుల్ నవ్వనేలా? విడంరాదె నీకిట్టి దుశ్శీలమేలా; మతిభ్రష్ట! నీ తల్లి నిల్లాలుగా నెంచి వర్తించుటం జేసి నీమోము వీక్షింపగా దోసమౌ గోపమా వేళ మైనప్పు డాత్మీయులైనం గృపాణంబుచే నిర్దయాత్ముండవై దున్మించుటం జూడ నీకంటె దుర్మార్గుడున్నాడె; నీచాధమా! నీదురూపంబు నీహుంకృతుల్ దుష్టచేష్టల్ ప్రలాపంబులున్ జెప్పగా శక్యమే; యెఱ్ఱనౌ కండ్లతో నొఱ్ఱుగా జూచుటన్, మెండుగా నుమ్ములన్ వైచి యేహ్యంబు గల్పించుటన్ నిన్ను జేతంగరా రెవ్వరుం గ్రోధచిత్తా! మదోన్మత్త! నిర్భాగ్యచారిత్ర! ధాత్రీస్థలింగూలి పీనుంగు చందంబునం బండియుండంగ నీ శత్రువుల్ జేరి నీయాస్తి సర్వంబునుం గాకితంబందు వ్రాయించి నీదౌ నిశాని తుదిన్ వ్రేలు ముద్రిం దగన్ వైచి నీ యాస్తి నెల్లం గ్రహింపం గడుం దుర్దశంబొంది దుఃఖించుచున్ జోగివై యుండగా నేల నీ యింట నీ యాలునుం బిడ్డలుం గూటికిం గుడ్డకుం దూరులై యేడ్చుచుం నిన్ను దూరంగ నొక్కింతయుం దెల్వి రాదా! సదా కల్లుపాకే గృహం బన్న సత్రంబు పానీయశాలంబు నూహించి జీవింపనేలా; జగద్రక్షకుండైన సర్వేశ్వరుం భక్తిం బూజించు



# మద్యపాననిరసనదండకము

(అల్లంరాజు సూర్యనారాయణ మూర్తిగారు.)

ఓరీ! సురాపానలోలా! కృధాగ్ని ప్రకాశోరుఫాలా! ఇసీ! దుష్టశీలా! మహా పాతకంబైన యీ మద్యపానంబు సేయంగనేలా! మదోన్మత్తతన్ లోకులం దిట్టనేలా! ఒడల్ తూలుచుం, జోగుచుం, గ్రుక్కుచున్, స్రుక్కుచున్, సోలుచున్, సిగ్గు గాసింత లేకుండ నాహా పథిన్ దోర్ల నేలా, జనుల్ నవ్వనేలా? విడంరాదె నీకిట్టి దుశ్శీలమేలా; మతిభ్రష్ట! నీ తల్లి నిల్లాలుగా నెంచి వర్తించుటం జేసి నీమోము వీక్షింపగా దోసమౌ గోపమావేశమైనప్డు డాత్మీయులైనం గృపాణంబుచే నిర్దయాత్ముండవై దున్మించుటం జూడ నీకంటె దుర్మార్గు డున్నాడె; నీచాధమా! నీదురూపంబు నీహుంకృతుల్ దుష్టచేష్టల్ ప్రలాపంబులున్ జెప్పగాశక్యమే; యెఱ్ఱనౌ కండ్లతో నొఱ్ఱుగా జూచుటన్, మెండుగా నుమ్ములన్ వైచి యేహ్యంబు గల్పించుటన్ నిన్ను జేతంగరా రెవ్వరుం గ్రోధచిత్తా! మదోన్మత్త! నిర్భాగ్యచారిత్ర! ధాత్రీస్థలింగూలి పీనుంగు చందంబునం బండియుండంగ నీ శత్రువుల్ జేరి నీయాస్తి సర్వంబునుం గాకితంబందు వ్రాయించి నీదౌ నిశానీ తుదిన్ వ్రేలు ముద్రిం దగన్వైచి నీ యాస్తి నెల్లం గ్రహింపం గడుం దుర్దశంబొంది దుఃఖించుచున్ జోగివై యుండగా నేల నీ యింట నీ యాలునుం బిడ్డలుం గూటికిం గుడ్డకుం దూరులై యేడ్చుచుం నిన్ను దూరంగ నొక్కింతయుం దెల్విరాదా! సదా కల్లుపాకే గృహంబన్న సత్రంబు పానీయశాలంచు నూహించి జీవింపనేలా; జగద్రక్షకుండైన సర్వేశ్వరుం భక్తిం బూజించు



టర్ మాని ఛీ ఛీ! దయాసత్య శౌచమ్ములన్వీడి సన్మార్గులం
దిట్టుచుం గొట్టుచున్, జంపుచున్. చేతవిత్తంబు లేకున్న చౌర్యం
బులం జేయుచున్, ఖైదుకుం బోవుచున్ ముండికై మొండి
వై యెట్టటో గొంతకాలంబు జీవించి పెన్నిద్దురం బొంద
నున్నప్డు 'సారాయి దెమ్మంచు' త్రాగంగ నూహింతువౌరా!
మృతింగన్న యామీద నీపాట్లు యోచింప వేలా! కడుం
బాధలం గుందుచుం బెక్కు వేలేడు లయ్యామ్యలోకంబునం
దుర్గతిం బొంది దుఃఖింతు వయ్యో! యికన్మద్యపానంబు
చాలించి చిత్తంబునం దాజగన్నాథునీశున్ సదాభక్తి బూజించు
మెంతే దయా సత్య శౌచమ్ములం గల్గి వర్తించు మా వెన్క
నాముష్మికంబైన సౌఖ్యంబునుం బొందు మోయీ! స్థిరంబై
స్థిరంబై దివిన్.

# త్రాగుడు పైశాచిక కృత్యము.

లక్నో పట్టణ నివాసియగు రివరెండు జె. ఆర్. హాడ్సన్
గారు తమ యనుభవము నిటుల వ్రాయుచున్నారు:—
"కఱ్ఱు పెట్టి కాల్చినట్లు నామనస్సును దహింప జేయుచున్న
సంగతుల గొన్నిటి నీక్రింద దెలుపుచున్నాను. సైన్యమునకు
సంబంధించిన మతాచార్యుడ నగుటచే నేను సైనికుల చెఱ
సాలను వెళ్లి చూచుచుందును. గొప్ప నేరములు చేసినవారు
ఖైదుశిక్షను పొందినవారై సైన్యమునుండి వెడలగొట్ట
వేయబడుదురు. ఇట్లు శిక్షితులగు వారిలో ననేకులు త్రాగుడు



వలననే యట్టి శిక్షకు పాత్రులయిరని నేను కనుగొంటిని.
సూపరింటెండెంటు గూడ సైన్యములో జరుగు అనేక నేరము
లకు మద్యపానమే కారణమని యంగీకరించెను. సుఖరోగ
ములచే బాధపడువారి ఆసుపత్రిని గూడ నేను చూచుచుం
దును. అందలి రోగులలో దాదాపుగా నందరును ఆ జాడ్య
ములను తాము త్రాగుడు యొక్క మైకమునకు లోబడి
యున్న కాలమునందే తగిలించుకొనిరని అనుభవజ్ఞుడగు
ఒక అధికారి నాతో చెప్పెను ఈ నడుమ నా స్నేహితు
డొకడు ఒక చిన్నవానిని గూర్చి యిట్లు నాతో చెప్పెను.
ఆతని భార్యయు బిడ్డయు ఇంగ్లాండులో నుండిరి. హిందూ
దేశములోని ఒక నగరములో ఈ చిన్నవాడు మంచి యుద్యో
గము నందున్నాడు. త్రాగుడును గూర్చి యితనితో మతా
చార్య పదవియందున్న నా స్నేహితుడు అనేక పర్యాయములు
ముచ్చటించెను. త్రాగుటకు హక్కుగలదనియు, మైమఱచి
తాను త్రాగువాడను గాననియు, త్రాగుడు తనకెట్టి హానిని
చేయజాలదనియు అతడు పలికెను. ఇంగ్లాండునకు తిరిగిపోవునపుడు
త్రోవలో నతడొక ఫ్రెంచివారి పట్టణము నందు నిలువవలసి
వచ్చెను. పట్టణమును చూచుటకును తినుబండారములు కొన్ని
టిని కొనుటకును నావలోని యితర స్నేహితులతో గలిసి అతడు
బయలుదేరెను. తనకు తెలియకుండగనే ఆ రాత్రి త్రాగిమైక
ములోనున్న సమయములో నతడొక వ్యభిచారిణిగృహమున
ప్రవేశించెను. తెలివివచ్చి యాలోచించుకొనగా సుఖజాడ్య
మును తాను తగిలించుకొంటినని అతడు గ్రహించెను. అంతట

నతనికి గృహమునకు వచ్చుటకు మనస్సుకలుగలేదు. విశ్వాసద్రోహియైనందున ఆతడు తనభార్యను సమీపించుటకు సిగ్గుపడెను. త్రాగుడు యెంత హానికరమైనదో అతనికప్పుడు బోధపడెను. తనయుదంతమును మతాచార్యునికి తెలిపి "నాసంగతిని చెప్పి చిన్నవాండ్రను త్రాగుడుకు లోనుగావద్దని హెచ్చరింపు"డని వ్రాసెను. వీనినిగాని ఇట్టి ఇతరవిషయములనుగాని యెవ్వరు కాదనగలరు? త్రాగుడు పైశాచికకృత్యము. ఇట్టి చిన్నవాండ్రు పడిపోవుటకు అవకాశమును కలిగించు దురభ్యాసమును నేనుచూచి సహింపజాలను. మద్యపానమును దేశములోనుండి తరిమివేయుటకై నాచేతనైనంతవరకు పని చేయుటకు నేనుకృతనిశ్చయుడనైతిని.

—ధర్మసాధని

---

సీ॥ సిరిదొలంగియు జేత ♦ జిప్ప సేరుట లొండు
చిత్త విభ్రాంతిమై ♦ జెడుట రెండు
తనసంతతిని దరి♦ద్రతను గుందుటలుమూడు
కులహీనుడై దిగు♦ల్గొనుట నాల్గు
మును రహస్యమును జెప్పి ♦ మోసపోవుటలైదు
తారతమ్యంబుల ♦ మారు టారు
తలమెత్తి తిరుగుట ♦ కిలనోడుటయు నేడు
నెగతాళి సెందుట ♦ లెన్మిదవది
గీ. గాన నీయష్ట కష్టము♦ల్గనుటె గాక
నైహికాముష్మికముల క♦నర్హుడగును
మద్యపానమ్ము లొనరించు ♦ మానవుండు
మానదగునోయి తగదోయి ♦ మద్యపాయి॥

# మద్యము ఓజస్సును జెఱచును

## మద్యము మనస్సునకు వికారము గలిగించును.

శ్లో॥ మద్యం హృదయమావిశ్య । స్వగుణై రోజసో గుణాన్
దశభి, ర్దశ, సంక్షోభ్య, చేతో నయతి, విక్రియామ్॥

(చరక చికిత్సా స్థానము - చతుర్వింశాధ్యాయము 29)

తా॥ మద్యము హృదయమున జొచ్చి తనయందలి పదిగుణములచేత ఓజస్సన నుండు పదిగుణములను జెఱిచి మనస్సును వికారము నొందించును.

## ఓజస్సననేమి?

మనము భుజించునట్టి యాహారము, జాఠరాగ్నిచేజక్కగ పక్వముజెంది రసముగమారును. రసముచే రక్తమును, రక్తముచే మాంసమును, మాంసముచే మేధస్సును, మేధస్సుచే అస్థి (ఎముక) యును, అస్థిచేమజ్జయును, మజ్జచే శుక్రమును వరుసగ జనించును. ప్రాణాధారమగు నిట్టి శుక్రమునకు ఓజస్సు ఉపధాతువైయున్నది. మఱియు ఓజస్సు ఎట్టిదనిన:-

శ్లో॥ ఓజ స్సర్వశరీరస్థం శీతం స్నిగ్ధం స్థిరం మతమ్
సోమాత్మకం శరీరస్య బలపుష్టికరం మతమ్॥

(శార్ఙ్గధరసంహిత - పూర్వఖండం-5అధ్యాయం)

తా॥ ఓజస్సు శరీరం బంతటను వ్యాపించి శీతలము, మార్దవము, స్థైర్యము వీనితో గూడి చంద్రాత్మకమై శరీరమునకు బలము, పుష్టి, వీనిని గలుగ జేయును.

## మద్యముయొక్క పదిగుణములు.

శ్లో॥ లఘూష్ణ తీక్ష్ణ, సూ, క్ష్మామ్ల, వ్యవా, య్యాశుగ, మేవచ
రూక్షం, వికాసి, విశదం, మద్యం, దశగుణం స్మృతమ్.

తా॥ మద్యము (1)లఘువును (చుల్కనైనది) (2) ఉష్ణంబును (వేడిమి కల్గినది.) (3) తీక్ష్ణంబును (మృదుత్వము లేనిది, (4) సూక్ష్మంబును (సూక్ష్మమైన యాకారము కలిగినది) (5) ఆమ్లంబును (పులుపుకలిగినది.) (6) వ్యవాయియు (తొలుత శరీరమునందెల్ల వ్యాపించి పిదప జీర్ణంబగునది,) (7) ఆశుగము (శీఘ్రముగ రోగముల గల్గించునది, (8) రూక్షంబును (జిడ్డులేనిది) (9) వికాసి (ఉదకమున నుంచబడిన తైల బిందువువలె పలుదెఱంగుల విస్తీర్ణంబగునది). 10 విశదంబును (వేఱొండు వస్తువునం దంటకుండునది) నై పది గుణములు గలిగియుండును.

## ఓజస్సు యొక్క పదిగుణములు

శ్లో॥ గురు, శీతం, మృదు శ్లక్ష్ణం, బహులం, మధురం, స్థిరమ్
ప్రసన్నం, పిచ్ఛిలం, స్నిగ్ధం, ఓజో, దశగుణం, స్మృతమ్॥

తా॥ఓజస్సు—(1) గురుత్వము, (2) శీతలము, (3) మృదుత్వము,(4)శ్లక్ష్ణత్వము(నునుపు కలిగియుండుట),(5)మధురమై యుండుట(6)స్థిరత్వము(ఒక్కచోటనే నిలచి యుండుట), (7) ప్రసన్నత్వము, (8) పిచ్ఛిలత్వము, (9) స్నిగ్ధత్వము (జిడ్డుకల్గియుండుట) అను నీపదిగుణములు కలిగియుండును.



## మద్యగుణములు ఓజస్సుగుణముల జెఱచును.

శ్లో॥ గురుత్వం, లాఘువా, చ్ఛైత్యం చౌష్ణ్యా, దమ్లస్వభావతః
మాధుర్యంమార్దవం, తైక్ష్ణ్యాత్ప్రసాద, శ్చాశుభావనాత్ 32
రౌక్ష్యా త్స్నేహం వ్యవాయిత్వా, త్స్థిరత్వం, శ్లక్ష్ణతామపి
వికాసిభావా త్తైచ్ఛిల్యం, వైశద్యా, త్సాన్ద్రితాం తథా.
సౌక్ష్మ్యాన్మద్యం నిహం త్యేవ, మోజసః స్వగుణైర్గుణాన్
సత్వం తదాశ్రయశ్చాశు, సంక్షోభ్య, జనయేన్మదమ్॥ 34

తా॥ మద్యము పై జెప్పబడిన పదిగుణములలో లఘుత్వముచేత ఓజస్సునందలి గురుత్వమును, ఉష్ణముచే శీతలమును, ఆమ్లరసముచే మధురత్వమును, తీక్ష్ణత్వముచేమార్దవమును, ఆశుకారిత్వముచే ప్రసన్నత్వమును, రూక్షత్వముచేత స్నేహమును, వ్యవాయిత్వముచేత స్థిరత్వమును వికాసిత్వముచేత శ్లక్ష్ణత్వమును, విశదత్వము చేత పైచ్ఛిల్యమును, సూక్ష్మత్వముచేత సాన్ద్రిత్వమును వరుసగా చెఱచి, అట్టి యోజస్సును ఆశ్రయించి యుండు సత్వగుణమునుగూడ చెఱచి మదము (మత్తతను) గల్గించును.

శ్లో॥ 'రసవాతాది మార్గాణాం సత్వబుద్ధీన్ద్రియాత్మనామ్
ప్రధాన స్యౌజసశ్చైవ హృదయం స్థానముచ్యతే' ॥35॥

తా॥ రసవాహకధమనులు, సాత్వికగుణము, బుద్ధీంద్రియములు, ఆత్మ, ఓజస్సు వీనికి హృదయము స్థానముగ నుండును.

శ్లో॥ 'అతిపీతేన మద్యేన విహతే నౌజసా చ తత్
హృదయం యాతి వికృతిం తత్రస్థా యేచ ధాతవః ॥36॥

తా॥ అధికముగ త్రాగబడిన మద్యముచే ఓజస్సు క్షోభింపబడి హృదయము వికృతి నొందును. హృదయము నందలి బుద్ధి మొదలగు ధాతువులు కూడ వికృతి నొందును. ☞ "అధికముగ త్రాగబడిన మద్యముచే" యని నంతనే కొందఱధిక పానమువలన గీడు మూడునుగాని మితపానము వలన నొకింతయేని నేగిలేదని బలుకుదురు. గాని వారి వచనములు యుక్తికిని అనుభవమునకును మిగుల దూరముగనున్నవి. మొదటి మద్యబిందువు నోటపడిన దినముననే హృదయ వికృతి బీజము శరీరమున నాటబడినట్లగును. పానాభ్యాస మధికమైన కొలదిని బీజము మొక్కయై వృక్షమై శరీరమంతయు వ్యాపించియభ్యాసము మిన్నంటిన నంతనే విషఫలములన్నియు దృగ్గోచరము లగును. ప్రథమదశయందా వికృతి లక్షణము లన్నియు నాంతర్యముననె దాగియుండి కడపటిదశయందు బాహ్యమున గన్పట్టును. అంతియగాని మద్యమునందు దోషము లేకపోలేదు. మద్యమువలన దైహిక మానసిక వ్యాధులన్నియు నుత్పన్నము లగుననియు మానవమాత్రుడెవ్వడును యెట్టిసమయముననైనను మద్యమును గ్రోలరాదనియు మహాత్ములును వైద్యోత్తములును నైకకంఠ్యముగ వక్కాణించుచున్నారు.—ప్ర॥ సం॥

---

ఉ॥ దోసపుదారిఁజూపి పరితోషముమాపి యశంబుఁబాపి దు
ర్వాసన నోట రేపి భగవత్కృప దవ్వులఁజోపి బల్ రసా
భాసము జేసి యూపి నరుఁబాడొనరింతు వటండ్రు నిన్ను నో
యాసవమా! జొహారులు జొహారులు మా దెసఁ జూడ
బోకుమా॥

# పాననిషేధము - బైబిలు ఆజ్ఞలు

బైబిలు క్రైస్తవుల యొక్క ప్రమాణగ్రంథము. అది త్రాగుడును నిషేధించుచున్నది. బైబిలునందు విశ్వాసము కల వారెల్లరును దానిలోని యాజ్ఞలను శిరసావహించి మన్నింపవలయును. పానమును గూర్చి బైబిలు వివరించు విషయములు గ్రహింపకుండనున్న వారి మేలుకొఱకు బాటను పోవువాడునైతము పొరబాటుపడ నవసరము లేనంత స్పష్టముగనున్న కొన్ని యంశముల నిందుదాహరింతుము.

(1) బైబిలు రచింపబడిన కాలములో ముఖ్యముగా భాగ్యవంతములగు తరగతులలోని పానాచారములను గూర్చి బైబిలు తెలియజేయుచున్నది. ఆసందర్భమున సమ్మతినిగాని అసమ్మతినిగాని అది చూపుటలేదు. (2) బట్టీలో వండి దించు పద్ధతి బైబిలుకాలమున వాడుకలో లేదు. కావున నిరపాయకరములని చెప్పబడునట్టి స్వల్పముగ మద్యసారగుణముతో కూడియుండు ద్రాక్షారసమువంటి ద్రవములను సైతము త్రాగకూడదని యది నిషేధించుచున్నది. (3) ద్రాక్షారసమును గూర్చి వివరించిన 181 తావులలోని బైబిలు వాక్యములు కొన్నిచోట్ల మత్తునొదవించు దానిని గూర్చియు కొన్నిచోట్ల మత్తును కలుగజేయనట్టి క్రొత్తద్రాక్షారసము (టిరోష్) ను గూర్చియు తెలియజేయుచున్నవి. ఆకాలమున నీరెండు రకముల ద్రాక్షారసములును వాడుకలో నుండెను. చివరిది (క్రొత్తది—అప్పుడప్పుడు చేసినది) తరచుగా శ్రీయస్సునకు ఆశీర్వాదమునకు సంబంధించినదిగా నుదహరింపబడినది. "దేవుడు

ఆకాశహిమమును......విస్తారమైన ధాన్యమును క్రొత్తద్రాక్షారసమును నీకిచ్చెను." (ఆదికాండము 27-28).

(2) మొదటిది (క్రొత్తది కానిది) తఱచుగా వాడువారు దుర్గుణములను కలుగ జేసెను. మరియు (నోవహు) ద్రాక్షారసమును త్రాగి మత్తుడై తన గుడారములో వస్త్రహీనుడుగ నుండెను. (ఆది 9; 21) ఏసుక్రీస్తు ఏమాత్రమును మత్తులేని ద్రాక్షారసమును నీటిచేత చేసియుండెనని నమ్ముట మిక్కిలి యుక్తి యుక్తము. తమయొక్క త్రాగుబోతు అలవాటులు న్యాయమైనవని కనబఱచుటకై క్రీస్తుయొక్క ఈ యమానుషక్రియ నెడతెగకుండ నుదహరించుచుండువారు (లూకా 21: 34 లో) ఏసుక్రీస్తు చెప్పిన హెచ్చరిక వాక్యములను మఱచిపోయినారు:— "కాని జాగ్రతగ నుండుడు. లేకున్న నకస్మాత్తుగా తిండిపోతుతనము త్రాగుబోతుతనము లను నమితమైన బరువులు మీహృదయములపై వేయబడును." క్రీస్తుయొక్క యీకార్యము (నీటినుండి ద్రాక్షారసముచేయుట) నుదహరించుటతో తమత్రాగుడు న్యాయమైనదని చూపువారు తాముకూడ నీటితో చేయబడిన ద్రాక్షారసమును మాత్రమే త్రాగుచుండవలయును. అట్లుచేసినచో త్రాగుడును నిషేధించువారితో వీరికి వివాదములేకుండపోవును.

(3) త్రాగుడును—దారిద్ర్యమును:—సొలోమాన్ ఇట్లు చెప్పెను:-- "త్రాగుబోతు తిండిపోతు తప్పక దరిద్రులయ్యెదరు" (సామెతలు 23: 21). త్రాగుడు దరిద్రము తెచ్చుటయేకాక జనులలో పోరాటమునుకూడ కలుగజేయుచున్నది. ఆర్థి



క సంబంధముగా చూచుడు. పనివాండ్రమధ్య నమితభాగమల్లరి త్రాగుడువలననే కలుగుచున్నది. అందుమూలమునను పాటు నష్టమగుచున్నది "ఎవరికి శ్రమ? ఎవరికి దుఃఖము? ఎవరికి జగడములు? ఎవరికి చింత? ఎవరికి హేతువు లేని గాయములు? ఎవరికి దృష్టిమాంద్యము? ద్రాక్షారసముతో ప్రొద్దుపుచ్చువారికే గదా? ద్రాక్షారసమును రుచిచూడ జేరువారికేగదా? ద్రాక్షారసము మిక్కిలి యెఱ్ఱగను, గిన్నెలో తళతళ లాడుచుండగను త్రాగుటకు రుచిగనుండగను దానివైపు చూడకుము. పిమ్మట నది సర్పమువలె కఱచును. కట్లపాముపలె కాటువేయును. విపరీతమైనవి నీకన్నులకు కనుబడును. నీవు వెఱ్ఱిమాటలు పల్కుదువు. నడిసముద్రమున పరున్నవానివలెను, ఓడకొయ్య చివఱను పరున్నవానివలెను నుందువు. నన్ను కొట్టినను నాకు నొప్పి కలుగలేదు. నామీద దెబ్బలుపడినను నాకు తెలియలేదు. నేనెప్పుడు నిద్రమేలుకొందును? మఱలదానిని వెదకుదును అని నీవనుకొందువు" (సామెతలు 23: 29—35)

(4) త్రాగుడు మనశ్శక్తిని క్షీణింపజేయును: త్రాగుడువలన మానవునకు వచ్చునట్టి నిరాశకు నిలయమగు దుస్థితిని సొలోమాను వర్ణించెను. పాపమా త్రాగుబోతు దౌర్భాగ్యుడు మైకమువదలగనే యిట్లనును:—"నేనెప్పుడు మేల్కొనవలయును? తిరుగ నేనింకను ఆవిషయమును గూర్చి యడిగెదను?" (సామెతలు 23: 33—35). పానాభ్యాసముయొక్క వృద్ధికి,—దురభ్యాసముయొక్క వ్యాప్తికి మనశ్శక్తియొక్క క్షీణతకు ప్రధానకారణ మిచటకలదు. మనోబలము క్షీణించుటచే ప్రలోభనమునకు సదా వశుడై స్వప్రయత్నములతో

తనను తాను సంస్కరించుకొన నేరకుండునట్టి మనుష్యునకు సహాయము చేయుటకై నిషేధవిధి నవలంబించుట యిపు డావశ్యకము.

(5) త్రాగుడుమూలమున మంచి వంశపారంపర్యమునకు హానికలుగును. శాంప్సన్ (Sampson) పుట్టుకకు పూర్వము ఆతనితల్లికి ద్రాక్షారసము త్రాగకూడదని ప్రబోధింపబడెను. విదేశీయులగు హింసకుల బారినుండి యొకజాతికి తన యొక్కని యొక్క బలముతోడనే విముక్తిని కలిగింపవలసిన భారము శాంప్సనునదై యుండెను. దేవుడాతని కమానుష బలమును ప్రసాదించియు జన్మకాలమున శాంప్సన్ బలారోగ్యములు కలదేహమును కలిగియుండవలయునని కూడ (దేవుడు) తలంచెను. తల్లికేమియు వివరణము చెప్పబడలేదు, కాని "ద్రాక్షారసమును" త్రాగవద్దు, చాల మత్తుకలుగజేసెడు పానము వలదు అను ఆజ్ఞను చదువునపుడు త్రాగుడు యొక్క దుర్గుణములు సంతానముపై నెట్లు పనిచేయుచున్నది మనకు తెలియుచునే యుండుటవలన నీయాజ్ఞ యొందుల కీయబడినదో ఆకారణము విస్పష్టముగ గోచరించుచున్నది.

(6) త్రాగుడు సంఘమునకును, దొరతనమునకును నొకబెదరింపై యున్నది. "ద్రాక్షారసపానము నధికముగ చేయువారికిని, చాలమత్తుకలుగజేయు పానీయములను త్రాగు బలవంతులకును, లంచముతీసికొని దుష్టుని న్యాయవంతుడని నిరూపించి మంచివాని యొక్క మంచితనమును కాదనువారికిని దుఃఖమే సంభవించును" (ఎషయా 5:22).



బాధ్యతాయుతములగు సదుద్యోగపదవుల నధిష్ఠించియున్న త్రాగుబోతులు తఱచుగా తమ న్యాయబుద్ధిని గోల్పోయి బీదలకును, అసహాయులకును హింసకలుగుట కవకాశమిత్తురు. లేక తామే హింసకులై బాధింతురు. "రాజులు ద్రాక్షారసమును త్రాగకూడదు, రాజకుమారులు మిక్కిలి మత్తుకలుగజేయు పానీయములను కోరనేకూడదు. అట్లయిన వారు త్రాగి చట్టమును మఱచిపోయి బాధితుల విషయమున చేయవలసిన న్యాయవిచారణను తలక్రిందులు చేయుదురు" (సామెతలు 31:4-5). డానియేల్ ఐదవ ప్రకరణములో త్రాగుడుమూలమునను, అవిధేయతమూలమునను రాజ్యమును పోగొట్టుకొనిన యొక రాజుకథ గలదు. సేనలుకూలుటకు త్రాగుడు తోడ్పడెను. (1. రాజులు 20: 13-21) ఇతరులవినాశమునకు తోడ్పడువారు నిందార్హులైయున్నారు. "తన యిరుగుపొరుగువానికి త్రాగనిచ్చువానికిని ...... త్రాగునట్లు చేయువానికిని దుఃఖము సంప్రాప్తమగును" (హబక్కూకు 2-15) ఈప్రకరణమునందలి పండ్రెండవవాక్యములో "నరహత్యమూలమున పురనిర్మాణము చేయువారికి దుఃఖము, దుర్మార్గప్రవృత్తిచే రాష్ట్రనిర్మాణము చేయువారికి శోకము సంభవించును." ప్రజల యొక్క ప్రాణములను పీల్చునట్టి కార్యములద్వారా పన్నులనుగైకొను విధానమంతయు అక్రమసిద్ధాంతముపై నాధారపడియుండుటయే గాక అతినీచమైన ధనార్జనవిషయిక వ్యాపారమైయున్నది. (ఇండియన్ మెసెంజరు పత్రికనుండి యనువదింపబడినది.)

[illegible] క్రైస్తవుడా! బైబిలునందు నీకు విశ్వాసముకల

దేని మద్యపానము చేయబోకుము. క్రీస్తుయొక్క రక్తమని వైనుసారాయిమును త్రాగకుము. క్రీస్తు ద్రాక్షరసమును చేసి యుండెనని చెప్పి పానాభ్యాసము మంచిదని సమర్థింపజూడకుము. సారాయములవలన బలారోగ్యములు కలుగునని భ్రమపడకుము. పానాభ్యాసము నితరులకు కలుగజేయకుము. పాన చింతనము కొంచెమైన లేకుండనుండుము. ప్రి॥ సం॥

## త్రాగుబోతు

సీ॥ ఊగుచు జోగుచు నుమ్మిని గార్చుచు
తాండవమ్మాడును త్రాగుబోతు
కేరుచు గీరుచు క్రీగంటజూచుచు
దారిలో దొర్లును త్రాగుబోతు
తిట్టుచు గొట్టుచు దేహంబు తెలియక
తగవులాడుచుబోవు త్రాగుబోతు
త్రొవ్వుచు నవ్వుచు కూనుగుడ్డలుమాని
చంటాలలో దిగు త్రాగుబోతు

గీ॥ వావివరుసలు లేకుండ వర్తిలుచును
దొంగలాటకు దాదొడ్డ దొరగగూడి
యిల్లువళ్ళను క్రమముగా గుల్ల చేసి
నాగసుతుల బాధించును త్రాగుబోతు.

గీ॥ ఎక్కడను లేని కలహముల్ మిక్కుటముగ
గల్గు త్రాగుబోతులవల్ల ఘనముపీడు
వీరు భూమికి భారమై వెలయకుండ
జేయ కర్తవ్యమగు దేశనాయకులకు. (రవి)

## మద్యదుర్గుణాష్టకము

శ్లో॥ ఔష్ణ్యాచ్ఛీతోపచారం । తైక్ష్ణ్యాద్ధన్తి మనోగతిమ్
విశత్యవయవాన్ సౌక్ష్మ్యాత్ । వైశద్యాత్కఫశుక్రనుత్
మారుతం కోపయేద్రౌక్ష్యా । దాశుత్వా దాశుకర్మకృత్
హర్షదఞ్చ వ్యవాయిత్వా । ద్వికాసిత్వా ద్విసర్పతి.

—సుశ్రుతము.

తా॥ మద్యము ఉష్ణగుణముచేత శీతోపచారములను జెఱచును. తీక్ష్ణత్వముచేత మనోగతిని పోగొట్టును. సూక్ష్మత్వముచేత అవయవములందెల్ల వ్యాపించును. విశదత్వముచేత కఫశుక్రములను నశింపజేయును. రూక్షత్వముచేత వాతమును ప్రకోపింపజేయును. ఆశుకరంబగుటచేత శీఘ్రముగ మోహాదుల గల్గించును. వ్యవాయిత్వముచేత (తొలుత శరీరమున వ్యాపించుటచేత) రోమాంచమును గల్గించును. వికాసిత్వముచేత శరీరమున బలుదెఱంగుల వ్యాపించును. ఇట్లగుటను మద్యము శరీరమునందెల్ల వ్యాపించి పైదుర్గుణములను గల్గించును.

☞ మద్యపాయీ మద్యమును మితముగ గ్రోలినచో పైదుర్గుణములు కలుగవని తలంతువేమో అటుల భ్రమింపకుము. ప్రథమదశయందవి యన్నియు దృగ్గోచరములు గాకపోవచ్చును గాని మొదటి మద్యబిందువు నోటిలో పడిన క్షణముననే పైదుర్గుణబీజములు నాటబడినవని తెలిసికొనుము.

—పత్రికాధిపతి.

# అచలవేదాంతులు - మద్యపానము

అచలవేదాంతులు గొందఱు మనమేమితినిననేమి? ఏమి త్రాగిననేమని యనుచుందురని తఱుచు మనము వినుచుందుము గాని అచలగురువులలో సుప్రసిద్ధులగు కాల్వకోటయ్యగారు మద్యపానమువలన గలుగు ననర్థకములను స్వానుభవ పూర్వకముగ దెలిసికొని దానిని పూర్తిగ నిషేధించి తమ "శ్రీగురు నామ తత్త్వకీర్తనలు" అనుగ్రంథమున నిటుల వ్రాసిరి:—

సీ॥ తప్పక కాల్వకోటప్ప ప్రార్థించిన
మనవి గైకొను సర్వజనక నీవు
సారాయి త్రాగుట చాలద్రవ్యపు ఖర్చు
వాంతిపైత్యము తమోభ్రాంతిబుట్టు
కండ్లకా రోధంబు కమలాక్ష కనుపించు
కాయంబు వడిచెడి కదలకెపుడు
వంచకత్వముగల్గు వసుధలోపల జూడ
దొరలకైనను యోగ వరులకైన
గీ॥ గాన మధుపానదోషముల్ గట్టిగాను
గతముచేసియు మీపదహితుల గూడి
సచ్చిదానంద రూపమై సన్నుతింప
భద్రగిరిరామ కరుణించు విభవరామ.
గీ॥ పరగ సిద్ధార్థినామ సంవత్సరమున
మాఖమాసంబు లోపల మరియు శుద్ధ
పంచమీరోజు మధుపాన వాంఛ వర్జి
తంబుజేసితి నీకృప నంబుజాక్ష.



అచల గురువర్యులారా! శ్రీ కోటయార్యుల దివ్యోపదేశము నాలకింపుడు. మీసంఘములయందు మద్యపానమును సంపూర్ణముగ నిషేధింపుడు. మద్యపానము వలన పవిత్రమగు నచల సాంప్రదాయమునకు గలిగిన కళంకమును మాపివేయుడు. —సాధకుడు.

## మద్యపాననిషేధము

ప్రభుత్వమువారు మద్యపాన నిషేధ ప్రచారమునకు 4 లక్షల రూప్యముల నొసంగిరి. మద్యము త్రాగుట కవకాశము లుండునంతవరకు మద్యపాన నిషేధము కొనసాగనేరదు. ఒకవంక కావలసినవారికి మద్యవిక్రియమునకు సౌకర్యములు గావించుచు, మద్యమును విక్రయించుచు వేరొకవంక మద్యమును త్రాగగూడదని బోధించుటవలన నెట్టి ప్రయోజనము గలుగజాలదు. మద్యనిషేధమును బోధించువారు తాము మార్గదర్శకులుగ నుండవలెను. మద్యవిక్రియమును మాన్పవలెను. దైహిక మానసిక వ్యాధులన్నిటికిఁ బుట్టినిల్లగు మద్యపానము వలని ధనలాభమును సంపూర్ణముగ గోల్పోవుటకు సంసిద్ధత జూపినగాని నిషేధము కొనసాగజాలదు. —పత్రికాధిపతి.

## సారాయి పాట

సారాయి త్రాగవద్దన్న, సంసారములోనున్న సారమే చెడునన్న ॥సా॥

దారిలోనేరాయి చోరునిచేరాయి యీరాయి, ఆరాయి, యేరాయి దాకునో ॥సా॥ పగవాడు పడగొట్టునన్నా, నీకు

తగువాడు వెలిబెట్టునన్నా, భార్యమొగమోరగ జెట్టునన్నా, కొడుకు తగదంచు ఛీకొట్టునన్నా, ఉన్ననగరులో పగబుట్టునన్నా, యింట్లో శిగపట్లే, నగుబాట్లే, యగచాట్లే యగునన్నా ॥సా॥ పరులాలో మరియాదసున్న, ఆచట మరల మాటాడినతన్నే, కైపుబరువాయెనా దేలకన్నే, దుడ్డు కఱువాయెనా నోటమన్నే, యిదివఱకున్న నీపేరుసున్నే, గాన త్రాగుట విడుమన్న ॥సా॥ ఇల్లాలి నేడ్పించి పిల్లాలవంచించి, తల్లిదండ్రుల ఘోరదారిద్ర్యమున ముంచు ॥సా॥ యెల్లసంసారము పొల్లు చేయక నగ్బరల్లి చెప్పినమాట చల్లాగవినరన్న ॥సా॥

—రాజంశెట్టి శివప్ప, రెడ్డి రామిరెడ్డి, పెదకొప్పెర్ల

సీ॥ మరియాద కడతేర్చు మానముఁ దెగటార్చు
జ్ఞానముఁ బొలియించు శాంతమడచు
రోగముల్ బుట్టించు రోషము నగుబెంచు
ప్రాణభంగము దెచ్చు బలముదొలచు
బరుషముల్ బ్రోలించు బలుగాకి గావించు
ధనమెల్ల హరియించు మనసు గలచు
దలిదండ్రులను దుఃఖజలరాశి నోగిముంచు
సతిసుతాదుల నెల్ల వెతలబెట్టు.
గీ॥ దనువెఱుంగని మత్తు దనరంగ గలిగించు
జననింద నొదవించు ఘనతజెఱచు
సోయగంబు మాపు జోరునిగావించు
గుండెగాల్చు మేను నెండజేయు
నకట యిన్నికీడులకు నాలవాలంబు
త్రాగుబోతుతనము ధరణినెపుడు. —ఒక క్రైస్తవుడు

# కల్లు-సారాయి-బ్రాంది-బీరు.

సీ॥ కోతిచేష్టలజేయఁ గోరించుగావున, గల్లుగాదది పెద్దముల్లుగాని । బుద్ధివైకల్యంబు బుట్టించుగావున, బ్రాందిగాదది పెనుభ్రాంతిగాని । సారహీనత్వంబు సమకూర్చుగావున, బీరుగాదది పట్టి బీరుగాని । ప్రాణముల్ తీయంగ బాల్పడుగాన సారాయికాదది కుసారాహిగాని॥ గీ॥ పెక్కులేటికి బరికింప లెక్కలేని । చిక్కులెల్లను బానంబు సిద్ధపఱచు । గాన జనులార సుఖపడగాంక్షయున్న ! బ్రదుకు డికమీద హాయిగా బానముడిగి॥

సీ॥ మంచి మార్గంబున మసలంగనీయక, దారికడ్డుగనుండు, ముల్లు కల్లు । కలిగినదానిని గడుపార దిననీక, గారించుకూటిలో కల్లు కల్లు । నిలుకడ మతిలేక నిచ్చలు భ్రమణంబు కలిగించుచుండెడు కల్లు కల్లు । చెడుబుద్ధులెన్నెన్ని పుడమినున్నవో వానికెల్లను దాను పుట్టిల్లు కల్లు॥

గీ॥ పెక్కులేటికి........॥

సీ॥ పెద్దషాపులలోన నద్దంపు బీరువాలందు నొప్పుచునుండు బ్రాంది మొదలు । చిట్టిపాకలలోన లొట్టెలలోపల గ్రాలుచునుండెడు కల్లువరకు । గలుగు మద్యములెల్ల కలియనుసైతాను, ప్రజలను జెఱుపంగ బంపినట్టి । కింకరులనుటకు శంకింపబనిలేదు, చక్కగా బరికింప సత్యమగును॥

గీ॥ పెక్కులేటికి........॥

సీ॥ రుచిలేదు దేహంపురుచి చెడగొట్టును, మద్యమేటికి నింక మందులార । పసలేదు గాత్రంపు పస తెగటార్చును, మద్యమేటికినింక మందులార । సారంబులేదు ధీసారంబు దిగద్రావు, మద్యమేటికి నింక మందులార। శ్రీ కరమదికాదు శ్రీ

# ప్రకృతి పత్రిక

కరము చెఱచు, మద్యమేటికి నింక మందులార॥
గీ॥ పెక్కులేటికి...... —(కా॥ బ్రి॥ శా॥ రవి.)

సీ॥ క్రొత్తగాజచ్చిన యుత్తతద్దినమంచు తిత్తుల సారాయి
దెచ్చు నొకడు। అందులోనికి నంజుడనుకూలమౌనంచు కోడి
పెట్టలబట్టికోయునొకడు। మాతాతనాడిది మర్యాదటంచును
మేకతలలబట్టి మెక్కునొకడు। చాత్తాని గురువులచేతి తీర్థం
గాని ప్రీతిసారాగ్రోలి ప్రేలునొకడు॥ గీ॥ వీరలంట సదాచార
ధీరులంట। నీతికోవిదులట మహానీయులంట। సూరిజనులార
వినరయ్య చూడరయ్య। కట కటా కాలమహిమల గాంచు
డయ్య॥ —సన్మార్గబోధిని.

మ॥ మనుజుండొక్కఁడు కల్లుపాకఁజొరి, తన్మధ్యంబు
నన్ వస్త్రహీనుని ధాత్రింబొరలాడువాని, మతిశూన్యున్,
శ్లేష్మసిక్తాంగునిన్! గని నాకంతటిఘాటుగల్లుసురనే, కై పెక్క
గాఁబోయుమీ! యని విక్రేతను గోరుసుమ్మి, యది నైచ్యం
బంచునెంచం డహా! —క॥ కోదండరామశర్మ.

ఉ॥ జార సఖిన్ ధనాంగనను జారుని చోరుని ద్రాగు
బోతు నె। వ్వారును గీర్తికాసపడువారలు కొంపకు జేర్ప
రాదు; త। ద్వారము కార్యమునుండినను దామును ద్రొక్కగ
రాదు నిక్కమిది తీరు పెఱుంగకున్న గొనితేవలెనే యపకీర్తి
యేరికిన్॥ —శ్రవణానందము

క॥ రామానుజ మతమని! బహాలు, సామెతలంగల్లు ద్రాగ
సాయింతురు; నీ। వేమరి చెడకుము, పలుకరు! నీమముతో
హరిపదముల నెలకొను మనసా॥ —హరిపద భ్యాసబోధము

# ప్రకృతి చందాదారులకు తగ్గింపు ధరలు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 16 | రక్తపరిక్షాళన చికిత్స (పటముతో) | 0 | 5 | 0 | 0 | 4 | 0 |
| 17 | పచ్చితిండివలని ప్రయోజనము | 0 | 12 | 0 | 0 | 10 | 0 |
| 18 | స్వాభావిక చికిత్సానియమములు | 0 | 5 | 0 | 0 | 4 | 0 |
| 19 | తొట్టిస్నాన నియమములు | 0 | 6 | 0 | 0 | 5 | 0 |
| 20 | నిర్వ్యాచారభావిజీవనము(కొబ్బరిగూర్పి) | 1 | 8 | 0 | 1 | 0 | 0 |
| 21 | యోగచికిత్స (హిందికి తెనుగు) | 0 | 6 | 0 | 0 | 5 | 0 |
| 22 | ప్రాకృత చికిత్సార్ణవము 1వ॥ భా॥ | 1 | 8 | 0 | 1 | 0 | 0 |
| 23 | ప్రోథపరిభాకరము (1,2 భాగములు) | 2 | 0 | 0 | 1 | 8 | 0 |
| 24 | శుక్లనష్టము (1వ భాగము) | 0 | 12 | 0 | 0 | 9 | 0 |
| 25 | లక్ష్మణజలచికిత్స (పటములతో) | 0 | 12 | 0 | 0 | 8 | 0 |
| 26 | మహారోగము (హరయోగీంద్రులు) | 0 | 8 | 0 | 0 | 6 | 0 |
| 27 | ఔషధవైద్య మొక యూహాశాస్త్రము | 0 | 4 | 0 | 0 | 3 | 0 |
| 28 | శిశుమాతల కొక సందేశము | 0 | 4 | 0 | 0 | 3 | 0 |
| 29 | ప్రకృతిచికిత్స (పం॥ అయ్యాగ్ గారు) | 0 | 5 | 0 | 0 | 4 | 0 |
| 30 | ప్రకృతిచికిత్స (కె. యల్. శర్మగారు) | 0 | 5 | 0 | 0 | 4 | 0 |
| 31 | స్త్రీలవ్రతము (జ్ఞానాంబగారు) | 0 | 3 | 0 | 0 | 2 | 0 |
| 32 | ప్రకృతిచికిత్స కా॥ నాగేశ్వరరావుగారు | 0 | 5 | 0 | 0 | 4 | 0 |
| | తత్వలక్ష్యార్ణవము (వైరాగ్యము) | 1 | 0 | 0 | 0 | 15 | 0 |
| 33 | తెల్లచక్కెరవలని విపత్తు | 0 | 10 | 0 | 0 | 6 | 0 |
| 34 | తేనీరు విషతుల్యము | 0 | 10 | 0 | 0 | 6 | 0 |
| 35 | ప్రాకృత చికిత్సార్ణవము (2. భాగము) | 1 | 4 | 0 | 1 | 0 | 0 |
| 36 | ఆరోగ్యము - కామేచ్ఛ | 0 | 3 | 0 | 0 | 2 | 0 |

అడ్రెసు—మేనేజరు, ప్రకృతి, బెజవాడ.

# ప్రకృతి చందాదారులకు తగ్గింపు ధరలు

| | | |
|---|---|---|
| 37 జీవహింస (1 భాగము) | 0 10 0 | 0 6 |
| 38 పొగచుట్ట-ముక్కుపొడుము 1 భాగము | 0 10 0 | 0 |
| 39 కల్లుముంత-సారాయి సీసా. 1 భాగము | 0 10 0 | 0 |
| 40 వర్ణచికిత్స | 0 6 0 | 0 |

పుస్తకముల జాబితా ఉచితము.

## ప్రకృతి సంపుటములు.

ప్రకృతి 1, 3, 4, 5, 6, 7 సంపుటములను, సంచికలును తగ్గి ధరలకు దొరకును. ఇందు సుప్రి ప్రకృతి చికిత్సకులచే వ్రాయబడిన అమూల్య వ్యాసము ప్రశ్నోత్తరములు, మున్నగున వెన్నియో కలవు. ప్రతి వై ద్యునకు, రోగికిని మిక్కిలి యుపయుక్తమైనవి. వీనిని జ నచో ప్రకృతిచికిత్సయందు దమితనైపుణ్యము గలుగు కొలది ప్రతులుమాత్రమే కలవు. మరల ముద్రింపబడ

| | | ఇతరులకు | చందాదా |
|---|---|---|---|
| ప్రకృతి 1వ సంపుటము 3 నెల సంచికలు | | 0 6 0 | 0 4 |
| ప్రకృతి 3వ సంపుటము 9 నెలసంచికలు | | 1 2 0 | 0 14 |
| ప్రకృతి 4వ సంపుటము 12 నెలసంచికలు | | 1 8 0 | 1 2 |
| ప్రకృతి 5వ సంపుటము 12 నెలసంచికలు | | 1 8 0 | 1 2 |
| ప్రకృతి 6వ సంపుటము 12 నెలసంచికలు | | 1 8 0 | 1 2 |
| ప్రకృతి 7వ సంపుటము 10 నెలసంచికలు | | 1 2 0 | 0 15 |
| 36 English Supplements to Prakriti | | 0-0-6 | 0-0 |
| 4 do (Booklets) each supplement | | 0-2-0 | 0-1 |

అడ్రెసు:—మేనేజరు, ప్రకృతి, బెజవాడ.

